అమాయకత్వం పోయి, హిపోక్రసీ మొదలవుతుంది. దీన్నే సూడో-ఇనో్నసెన్స్ అంటారు. ఈ దశలో వారు తమ గొప్పతనాన్ని గుర్తించుకోరు. అంతా విధివిలాసమని, ఏదైనా మన మంచికేలాటి సూక్తులతో, మెట్ట వేదాంతంలో గడిపేస్తూ వుంటారు. ఓవిధంగా ఇది వాళ్ళకు డిజప్పాయింట్‌మెంట్లకూ, నిస్పృహలకూ తట్టుకునే (సూడో) శక్తి నిస్తూ వుంటుంది. ఇలా భ్రమల్లో బ్రతకడంవల్ల తాత్కాలికంగా మనశ్శాంతి లభించినా మొత్తానికి సరైన పద్ధతికాదు.

మానసికంగా వ్యక్తిత్వాన్ని పెంచుకోనడంవల్ల, స్వంతంగా నిర్ణయాలు తీసుకుని, ధైర్యంగా వాటి ఫలితాలకు తట్టుకునే స్థయిర్యంఅలవర్చుకోవడం మంచి మార్గం. కానీ, ఆ లేత వయస్సులో ఇంత విశ్లేషణాశక్తి (అందులోనూ ఎవరూ గైడ్ చేయని స్థితిలో వున్నప్పుడు) ప్రదర్శించడం అసాధ్యమని చెప్పవచ్చు. ఇది ఇలాగే కొనసాగటంవల్ల పిల్లలు న్యూరోటిక్‌గా తయారయ్యే ప్రమాదం వుంది. ఈ సూడో - ఇనో్నసెన్స్‌లో బ్రతుకుతున్న వ్యక్తి తన అసమర్థతను అమాయకత్వమని చెప్పుకుని, అమాయకులని దేవుడే కాపాడుతాడనే భ్రమలో వుంటాడు. వీరిలో చిన్నతనపు ఛాయలు పోవు. పోవడానికి వాళ్ళిష్టపడరు కూడా. చిన్నతనమంటే ఇక్కడ పిల్లల్లో వుండే స్వచ్ఛత, స్పాంటెనిటీ, చురుకుదనమని కాదు; ఎప్పుడూ ఎవరో ఒకరు తమ బాధ్యత తీసుకోవాలని డిమాండ్ చేసే మొండితనం. ఇలా తమ కనుకూలంగా ప్రవర్తించే పద్ధతిని బట్టే దీనికి 'సూడో' అని పేరొచ్చింది.

మన గొప్పతనం ప్రపంచం గుర్తించక్లేదని, ఏదో ఒకరోజు హీరోయిక్‌గా ప్రవర్తించి, చెడునంతా తొలగించేసి, దుష్టశిక్షణ చేసిపారేసి అందరిచేత గుర్తింపబడతామని, కీర్తింపబడతామని కలలు కనటం మొదలెడతాం. ఈ సూడో మనస్తత్వం నిజంగానే బాధాకరమైనది. కానీ, దీన్ని ఒప్పుకోక, అదే నిజమైన అమాయకత్వమని మొండిగా వాదించేవాళ్ళు, ఏంగ్జయిటీ, డిప్రెషన్ లాంటి వాటికి లోనవుతూ వుంటారు. అంతేకాక,

కష్టాలనేవి అందరికీ మామూలే అయినా, తామేదో ప్రత్యేకమనీ, కాబట్టి తమలాంటి వాళ్ళకి అవి రాకూడదని గొంతెమ్మ కోరికలు కోరుతూ వుంటారు. భ్రమలు లేకుండా బ్రతకడం వీరికి చాలా కష్టంగా తోస్తుంది.

ఇతర జీవాలతో పోల్చి చూస్తే, పసితనపు ఛాయలూ, ఆధారపడే మనస్తత్వం పక్షులూ, జంతువులకన్నా 'మనుష్యుల్లోనే' దీర్ఘకాలం కన్పిస్తుంది.

వయస్సు పెరుగుతున్నకొద్దీ, చుట్టూ వున్న రిస్క్ అర్థమవడం వల్ల తమను కృంగదీసే పరిస్థితులమీద అనాసక్తత కలిగి, 'అజ్ఞానమూ, ఏమీ తెలియనితనమే' సేఫ్ అనుకునే స్థితికొస్తారు. ఇది సేఫ్టీ అనుకోవడం ఎంత అబద్ధపు భావనైనా, వారికది బాగా తోడ్పడుతుంది. పిల్లల్లో అలాంటి అమాయకత్వం గొప్ప కంఫర్టు ఇస్తుంది. 'సూర్యుడెందుకు ఉదయిస్తాడు?' అనే ప్రశ్నకి 'ఉదయించాలి కాబట్టి' లేదా, 'నేను ప్రొద్దున్నే లేవాల్సిన సమయం తెలియడానికి' అన్న సమాధానాలు బోల్డంత సంతృప్తి కల్గిస్తాయి. 'సూర్యుడు ఎందుకు అస్తమిస్తాడు?' అన్న ప్రశ్నకి, 'అలసిపోతాడుకాబట్టి' అనో 'నేను నిద్రపోవాలి కదా మరి' అనే సమాధానాలు మనంఎదురు చూడవచ్చు. సింప్లిసిటీయో లేదా, ప్రపంచంలో ఏదైనా 'తమ అనుకూలం కోసమే' అనే భావన వారికి బాగా నచ్చుతుంది. 'వానా వానా రావమ్మా, నన్ను తడిపి పోవమ్మా' అని ప్రకృతిని కమాండ్ చేయడంలో వున్న ఆనందం ఇంత పెద్ద ప్రపంచంలో ఓ చిన్న పిపీలికం మనిషి అన్న పచ్చి నిజం రియలైజ్ చేయడంలో రాదు. కానీ ఈ సూడో - అమాయకత్వంలో వుండడంవల్ల మన పవర్ మనకు తెలిసే అవకాశం లేదు.

నిజాలు అర్థమయ్యేకొద్దీ, ఒక రకమైన అయిష్టత పెరుగుతూ వుంటుంది. మనం పట్టించుకోకుండా అమాయకంగా వుండాలనుకునేకొద్దీ ఆ అయిష్టత పెరుగుతూ వుంటుంది. అందుకే మన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా బ్రతకడంలో వున్న ఆనందాన్ని డిస్కవర్ చేయాలి. అలా చేయగలగాలంటే, మనం మన

అమాయకత్వం ముసుగు నుంచి బయటపడాలి. ఇది మనకు చాలా సంక్లిష్టమైన వ్యవహారంలా కన్పించవచ్చు.

పరిస్థితుల్ని మరింత విషమం కాకుండా కాపాడుకోగలగడంలో మన లౌక్యం, మన తెలివితేటలు బయటపడతాయి. ఇదంతా కష్టమే అయినా, చెత్త సిద్ధాంతాల్ని నమ్మటంవల్ల కలిగే నిస్పృహ, క్షోభ అంత బాధాకరం మాత్రం కాదు.

కొంత సూడో - ఇన్నోసెన్స్‌తో కొంతమంది పెద్ద వేదాంతుల్లా, అన్నీ త్యజించిన మహర్షుల్లా ఫోజిచ్చేస్తూ వుంటారు. ఇలా కన్పించడానికి వాళ్ళ జీవితంలో అతి చిన్న చిన్న ఆనందాలకు కూడా దూరమవ్వాల్సొస్తుంది. దానికి సిద్ధంగా లేని పక్షంలో మరింత అభాసుపాలయ్యే ప్రమాదం వుంది.

మనం చేసే ప్రతి పని వెనుక కారణాలు వెదుక్కోవడం చాలా అవసరం.

మనం చేసే పనులన్నిటికీ మూడు స్టేజీలు వుంటాయి.

మొదటి స్టేజీలో—మనకేదో కావాలనో, ఏదో లేదనో అనిపిస్తూ వుంటుంది. ఆ అసంతృప్తి అస్పష్టంగా తెలుస్తూ వుంటుంది. ఒక పని చెయ్యాలనిపిస్తుంది. అది చెయ్యకపోతే ఇబ్బందిగా ఉంటుంది.

ఇక రెండో స్టేజిలో—ఏదో విధంగా మన అవసరాన్ని తృప్తి పరుచుకోవాలనిపిస్తుంది. ప్రయత్నం చేయటం మొదలవుతుంది.

మూడోది—తృప్తి స్టేజి. పనిచేయటంవల్ల కలిగే సంతృప్తి ఇది.

ఈ ప్రపంచంలో చాలామంది మొదటి స్టేజిలో ఆగిపోతారు. ఇంకా చాలామంది రెండో స్టేజీలో ఆగిపోయి బాధపడతారు. కొద్దిమందే మూడో స్టేజి పూర్తి చేస్తారు.

అందుకే 'ఆరంభింపరు నీచ మానవులు' అన్నాడు భర్తృహరి.

—*—